# జమీన్ రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    సంపుటి : 71    సంచిక : 6    11.2.2000 శుక్రవారం    12 పేజీలు    విడిప్రతి: రూ.2.00లు    సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

## క్లింటన్ హైద్రాబాద్ నగర పర్యటన ఖరారయితే

# చంద్రబాబు హవాకు ఇక పట్టపగ్గాలుండవ్!

అమెరికన్ అధ్యక్షుడు బిల్ క్లింటన్ హైదరాబాదు నగరం సందర్శించడం ఖాయం అన్న ఆనందంతో తబ్బిబ్బు లౌతున్నారు ఆంధ్రపాలకులు. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సంతోషం పట్టడానికి పగ్గాలు దొరకడం లేదు. అమెరికన్ అధ్యక్షుడిని స్వాగతించి ఆతిథ్యం ఇచ్చే అవకాశం ఒక ముఖ్యమంత్రికి లభించడం చిన్న అదృష్టం కాదు. అమెరికన్ అధ్యక్షుడు అంటే ప్రపంచాధినేతతో సమానం. ఒక అమెరికన్ ప్రెసిడెంట్ ఇండియాను సందర్శించి రెండు నగరాలకు పైగా సమయం అయిందంటేనే ఆ పర్యటన ప్రాధాన్యత అర్థం చేసుకోవచ్చు. చంద్రబాబు దొరకని గట్టివారు. దీనికంత ఆగిలో స్వాగతించడం అవసరమా అని దీర్ఘాలు తీస్తున్నారు. కాని చంద్రబాబుతో రాజకీయంగా విభేదించే వారు సైతం స్వాగతించవలసిన పర్యటన ఇది. అమెరికన్ అధ్యక్షుడు ఇతర దేశాల పర్యటనలో వుంటే,

### క్లింటన్ బృందానికి ఫైవ్ స్టార్ హోటళ్లలో వెయ్యి గదులు కావాలట!

ప్రపంచం దృష్టి యావత్తు ఆ దేశంపై పడుతుంది. ప్రపంచ పత్రికలన్నీ ఆయా దేశాలు, నగరాల గురించి విశేష వ్యాసాలు ప్రచురిస్తాయి. చరిత్ర సామాజిక జీవనం, ఆర్థిక పరిస్థితులపై సమగ్ర సమాచారం వ్యాప్తి చేస్తాయి. అధ్యక్షుడి వెంట వచ్చే వెయ్యిమందిలో, నాలుగువందల మంది పత్రికా విలేఖరులే! కీలకమైన టెలివిజన్ ఛానళ్లన్నీ తమ సమయాన్ని ఆ పర్యటనకే వెచ్చిస్తాయి. ప్రపంచంలో మరే నాయకుడికీ ఇంత ప్రచారం లభించడం అసంభవం.

ఆర్థికాభివృద్ధికి, టూరిజం వ్యాప్తికి వాడుకోగలిగితే ఈ ప్రచారం ఎంతో అమూల్యమైనది. కొన్ని వందలకోట్లు ఖర్చు పెట్టినా భారతదేశాన్ని, భారత నగరాలను ప్రపంచ ప్రజలకు పరిచయం చేసేందుకు ఇంత కంటే మంచి అవకాశం లభించదు. అందువల్లనే చంద్రబాబు నాయుడు ఈ పర్యటనకు అంత ప్రాధాన్యత ఇస్తున్నారు. అమెరికా, ఐరోపా దేశాలు దాటి పెట్టుబడులు పెట్టడానికి తగిన దేశం ఏది అనే అన్వేషణలో వున్న పారిశ్రామికులను ఆకర్షించడానికి క్లింటన్ పర్యటన చక్కటి అవకాశం కల్పిస్తున్నది. చంద్రబాబు అంటే గిట్టనివారైనా ఈ పర్యటనకు తమ సహకారం అందించడం రాష్ట్ర భవిష్యత్తు దృష్ట్యా ఎంతో అవసరం.

అయితే ఇప్పటి వరకు క్లింటన్ పర్యటన ఖరారు కాలేదు. ఆయన హైదరాబాద్ రాక వీలౌతుందా లేదా అన్న పరిశీలన చేయడానికి వచ్చిన అమెరికన్ అధికారుల బృందం సైతం ఏ విషయమూ ధ్రువీకరించలేదు. 7వ తేది ఉదయం ఆ బృందం హైదరాబాద్‌కు వచ్చింది. అయితే వారు రాష్ట్ర ప్రభుత్వంతోగాని, ముఖ్యమంత్రితో గాని ఎటువంటి చర్చలూ జరపలేదు. తమను స్వాగతించడానికి ఎయిర్ పోర్టుకు వచ్చిన ప్రభుత్వ అధికారులను వెనక్కి పంపేశారు. ప్రభుత్వ ఆతిథ్యం స్వీకరించడానికి ఇష్టపడలేదు - వారికి కావలసిన హోటల్ గదులు, కార్లు తదితరాలను మద్రాసులోని అమెరికన్ కాన్సులేట్ ఏర్పాటు చేసింది.

తరువాయి 7వ పేజీలో

# స్వర్ణాంధ్రలో ఆకలి చావు

మహబూబ్‌నగర్ జిల్లా బిజినేపల్లి మండలం పాయిన్‌పల్లి గ్రామంలో జనవరి 31 తేది ఉదయం మంగమ్మ అనే మహిళ ఆకలికి తాళలేక మరణించింది. ఈ ఏడాది కరువు చావులకు ఇది ఆరంభం. చంద్రబాబు నాయుడు ప్రభుత్వం షరా మామూలుగా ఇది ఆకలి చావు కాదని, అనారోగ్య మరణమని ప్రకటించి చేతులు దులిపేసుకున్నది. కాని ఒక మానవహక్కుల సంస్థ ప్రతినిధులు ఆ గ్రామం వెళ్లి చూస్తే పరిస్థితులు దయనీయంగా కన్పించాయి. ఆ

### దిగుమతుల సరళీకరణ అమలయితే పేదల బ్రతుకు బుగ్గిపాలే!

ఊరి మొత్తం జనాభా 1600 మంది; కాని ఇప్పుడక్కడ వున్నది కేవలం 400 మందికి లోపు. వారిలో అధికులు ముసలివాళ్లు; పసి పిల్లలు. చేయి, కాలు కదపగల్గిన వారందరూ - ఆడ, మగ తేడా లేకుండా గ్రామం విడిచిపెట్టి కూలీ పనులు వెతుక్కొంటూ వలస పోయారు. అందుకు కారణం - గ్రామంలో చేయడానికి పనిలేదు. వరుస పంట పోయింది; బోర్లు కరెంటు చాలక పనిచేయలేదు; పొలాలన్నీ బీళ్లు పడ్డాయి. తినడానికి తిండి లేదు. ఇట్లా వలస వెళ్లిన వాళ్లలో నలుగురు వ్యక్తులు హైదరాబాదులో జరిగిన ఒక రోడ్డు ప్రమాదంలో మరణించారు. వారి శవాలను తిరిగి గ్రామం వరకు తీసుకువెళ్లే స్తోమత లేక, మునిసిపాలిటీ బండ్లలో తీసుకెళ్లి తగుల బెట్టారు.

చంద్రబాబు స్వర్ణాంధ్రప్రదేశ్ రాజధానిగా, సైబరాబాదుగా, నాలెడ్జి సిటీగా, అంతర్జాతీయ హబ్‌గా అభివృద్ధి చెందుతూ - రేపోమాపో అమెరికన్ అధ్యక్షుడ్ని తన వద్దకు రప్పించుకొంటున్న హైదరాబాదు నగరానికి కేవలం వందమైళ్ల దూరంలో గ్రామీణ ప్రజల నిజపరిస్థితి, దయనీయ స్థితి ఇదీ! ఏ పెద్ద దినపత్రికకూ ఇదొక వార్తాంశంగా కన్పించలేదు. రెండు నెలల తర్వాత రాబోయే బిల్ క్లింటన్‌కు ఏ పళ్లెంలో, మటన్ వేపుడు ఏ హోటల్లో ఏ దేశపు వంటవాడు ఏ తీరులో వండి వడ్డించబోతున్నదీ తమ పాఠకులకు అందరికంటే ముందు తామే తెలియ చెప్పాలన్న తొందరలో తీరిక లేకుండా పనిచేస్తున్నాయి దినపత్రికలన్నీ! ఇన్ఫర్మేషన్ టెక్నాలజీతో చంద్రబాబు సృష్టించబోతున్న స్వర్గధామాన్ని తమ కళ్లముందు నిల్పుకొని తన్మయులై పోతున్న ప్రజలకు ... చావు పట్టడం లేదు.

కాని వాజ్‌పాయి ప్రభుత్వం గత నెలలో సంతకం చేసిన దిగుమతుల సరళీకరణ ఉత్తర్వు యథాతథంగా అమలైతే - ఇటువంటి ఆకలిచావులు పత్రికలలో చదవాల్సిన అవసరం రాదు; ప్రతి గ్రామంలో, ప్రతి నగరంలో, ప్రతి దినం మన కళ్లముందే నిత్యకృత్యం కాబోతాయి. కోతి పుండును బ్రహ్మాండం చేసి చూపించడం ఈ విలేఖరి ఉద్దేశ్యం కాదు; బోడిగుండుకి మోకాలికి ముడిపెట్టే అభిప్రాయం కాదిది... చావుకి,

తరువాయి 7వ పేజీలో

# దేశం-బిజెపిల మధ్య మున్సిపల్ కుస్తీ

వచ్చే నెలలో జరుగనున్న మునిసిపల్ ఎన్నికలకు సంబంధించి తెలుగుదేశం, బిజెపి పార్టీల మధ్య అవగాహన కుదరడం చాలా కష్టంగా కన్పిస్తూంది. మొత్తం 103 మునిసిపాలిటీలలో తమకు కనీసం 45 కేటాయించాలని బిజెపి కోరింది. ఆ మాట వినగానే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కస్సుమని లేచారు. బిజెపి కోరిక సహేతుకంగా లేదని; మొన్నటి శాసనసభ ఎన్నికల్లో వారికి వచ్చిన సీట్లు, 1995 మునిసిపల్ ఎన్నికల్లో వారు పోటీచేసిన చోట వచ్చిన ఓట్లు పరిగణనలోకి తీసుకొని, ఈ ఎన్నికలకు సీట్ల సంఖ్య కోరాలి తప్ప, ఇష్టం వచ్చిన సంఖ్య చెప్తే ఒప్పుకునేది లేదని ఖరాఖండిగా చెప్పేశారాయన. 10 లేదా మరీ బలవంత పెడితే 15 వరకు ఒప్పుకోండి తప్ప, అంతకు మించి ఒక్క మునిసిపాలిటీ సైతం ఇవ్వడానికి లేదని తమ పార్టీ ప్రతినిధులను హెచ్చరించాడు.

### పది స్థానాలు ఇస్తానంటున్న చంద్రబాబు

కేంద్రంలోని ఎన్‌డిఎ ప్రభుత్వంలో బిజెపి తర్వాత తమదే అతి పెద్ద పార్టీ అయినప్పటికీ - తాము బేషరతుగా మద్దతు కల్పిస్తున్నామని; తమ పార్టీ వారికి మంత్రిపదవులు అడగకుండా త్యాగం చేసినందువల్లే రాష్ట్ర బిజెపి నుంచి నలుగురు ఎంపీలు కేంద్ర మంత్రులు కాగలిగారని; బిజెపికి తాము అంత సహాయం చేస్తుంటే, వారు మాత్రం గొంతెమ్మ కోరికలు కోరుతున్నారని నిష్ఠురం వ్యక్తం చేశారు ముఖ్యమంత్రి.

అయితే బిజెపి నేతల బాధ ఇంకో రకంగా వుంది. అసెంబ్లీ ఎన్నికల వేళ టిడిపి ఒత్తిడికి లొంగి తమకు అన్యాయం చేస్తే సహించేది లేదని జిల్లాల నుంచి పార్టీ కార్యకర్తలు హెచ్చరికలు చేస్తున్నారు. ఉభయ గోదావరులు, వరంగల్, విశాఖపట్నం, నిజామాబాద్ తదితర జిల్లాల బిజెపి కమిటీలు రాష్ట్ర కమిటీకి అల్టిమేటం

తరువాయి 7వ పేజీలో

# ఆర్‌బిఎఫ్-మాగుంట వివాదం పుట్టలో విషనాగులెవరు?

నాయుడుపేట రూరల్ బెనిఫిట్ ఫండ్ లిమిటెడ్ తో కలిసి మాగుంట శ్రీనివాసులురెడ్డి లేదా బాలాజీ గ్రూప్ పాత్ర, ప్రమేయం ఏమిటి? దాదాపు రెండు లక్షల మంది జీవితాలతో ముడిపడిన ఈ సమస్యకు నిజమైన కారకులు ఎవరు? ఇప్పుడు డిపాజిటర్లకు జరిగిన నష్టం ఎవరు పూడుస్తారు? ఎప్పటికైనా వారి డబ్బు తిరిగి వస్తుందా? వారి సంపదలకు, భోగభాగ్యాలకు ప్రతీకగా భాసించిన మాగుంట కుటుంబం ఒక్కసారి ఇంతటి సంక్షోభంలో ఎందుకు కూరుకు పోయింది? కోట్లకు కోట్ల ధనరాసులు వారి ఇంటి గదులలో పడి మూలుగుతుంటాయని కథలుగా చెప్పుకునే పరిస్థితి నుంచి ప్రజల సొమ్ము తినేశారన్న అప్రతిష్ఠ భరించవలసి రావడానికి కారణమేమిటి? ఇవాళ నెల్లూరులో విస్తృతంగా నానుతున్న ప్రశ్నలివి! వీటికి సమాధానాలు వెతకడం చాలా కష్టం.

ఆర్‌బిఎఫ్ చైర్మన్ సుబ్రహ్మణ్యం దేశం వదలి పారిపోయారు. సింగపూర్‌లోనో, మరో దేశంలోనో సుఖంగా బ్రతుకుతున్నాడు. అతడు విమానమెక్కకుండా నెల్లూర్లో వుంటే చాలా ప్రశ్నలకు సమాధానాలు లభించి వుండేవి. కాని అది జరగలేదు. అతణ్ని వెనక్కి రప్పించేందుకు మన చట్టాలకు శక్తి లేదు. అతడు సింగపూర్‌లో కూర్చొని మాగుంట శ్రీనివాసులురెడ్డి తమకు అన్యాయం చేశారు. ఆయన తీసుకొన్న అప్పులు తిరిగి చెల్లిస్తే తాను అందరికీ తిరిగి చెల్లి డిపాజిటర్లందరికీ ప్రతి రూపాయి వెనక్కి ఇచ్చేస్తానని ఎకనామిక్ టైమ్స్ పత్రికలో ప్రకటించారు. అది చదివిన వారెవరికైనా అయ్యో పాపం అనిపిస్తుంది. కాని ఇప్పుడు శ్రీనివాసులురెడ్డి తమ గ్రూపు తరఫున వున్న 85 కోట్ల రూపాయలు తిరిగి కట్టేస్తానని కోర్టుకు హామీ ఇచ్చారు. కాని సుబ్రహ్మణ్యం మాత్రం సింగపూర్ నుంచి తిరిగి రాలేదు. వచ్చే అవకాశం కూడా లేదు. అందుకు కారణం ఆర్‌బిఎఫ్ ఎగేసిన డిపాజిట్ల మొత్తం 85కోట్లు కాదు - 800కోట్లు! ఇంకా పైనే వున్నా ఆశ్చర్యం లేదు. ఒక్క శ్రీనివాసులురెడ్డి బాకీ రాబట్టగానే సమస్య పరిష్కారమౌతుందని జరిపిన ప్రచారం - తమ తప్పుల నుంచి తాము తప్పించుకోవడానికి చేసిందే! ఆ ప్రచార యుద్ధానికి బాలాజీ గ్రూపును ఒక సమిధగా వాడుకున్నారు.

తమ వైపు నుంచి తప్పు ఎక్కడ జరిగిందో, ఎవరు చేశారో శ్రీనివాసులురెడ్డి కాని, వారి గ్రూప్ ప్రతినిధులుకాని ఇప్పటి వరకు వివరించి చెప్పలేదు. అప్పటికీ మౌనమే వారి సమాధానంగా వుంది. సమాధానం చెప్పలేకనా లేక సమాధానం చెప్పడం ఇష్టం లేకనా అన్నది ఎవరికి వారు చర్చించి నిర్ణయించుకోవలసిందే! కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుందనే నెపంతో మౌనాన్ని శరణు జొచ్చారనిపిస్తుంది. నిజమైన కారణం అదేనని మా నమ్మకం.

వారు వివరణ ఇచ్చినా ఇవ్వక పోయినా లోకవ్యాప్తంగా మాగుంట కుటుంబం గురించి తెలిసిన ప్రతి ఇంట్లో దీనిపై చర్చ జరుగుతున్నదిప్పుడు. నెల్లూరులో అయితే ప్రతి ఒక్కరి 'టీ టాక్' అదే! ట్రంకురోడ్డు చెట్ల క్రింద, టీ బంకుల బెంచీల మీద అదే సంభాషణ. నెల్లూరు జనజీవితంలో వారి కుటుంబానికి ఏర్పడిన అనుబంధం ఫలితం అది. గత పదిహేనేళ్లుగా నెల్లూరు జిల్లాలో ఎవరే సంస్థ ప్రారంభించినా, సభ జరిపినా ప్రథమ విరాళం వారిదే. రాజకీయాలు, వ్యాపారాలు, ఉద్యోగాలు, మధ్యస్థాలు, మాటసాయాలు .. అలా అన్ని అవసరాలలో వారి ప్రమేయం వుండేది. అంతటి ఆత్మీయత పెంచుకున్నారు కాబట్టే, అంతగా చర్చనీయాంశం అవుతున్నారిప్పుడు. ఇప్పుడిక చివర వారికి మిగిలింది - అప్రతిష్ఠ, ఆవేదన, మానసిక క్షోభ మాత్రమే.

ఆర్‌బిఎఫ్ దగా వ్యవహారంలో మాగుంట కుటుంబం చేసిన తప్పుల కంటే, ఎవరో చేసిన నేరం నెత్తికెత్తుకున్నదే అధికమనడం వాస్తవం. నిజం చెప్పాలంటే ఆ అభిప్రాయమే సమంజసం. తమ దగ్గర పనిచేసే సిబ్బంది పేర్లతో వున్న 85కోట్ల అప్పులను తిరిగి కట్టడానికి శ్రీనివాసులురెడ్డి కోర్టులో ఒప్పుకున్నారు. కోర్టు వరకు రాకుండా ఇంతకు ముందే ఆర్‌బిఎఫ్ స్పెషల్

తరువాయి 6వ పేజీలో

# పొదితనాడు - పూంగినాడు

**నెల్లూరు జిల్లా పుట్టుపూర్వోత్తరాలు - 6**

◆ ◆ ◆

**డాక్టర్ సి.వి. రామచంద్రరావు**

గతవారం నెల్లూరు జిల్లా చరిత్రలో పాకనాడు అనే పాలనా విభాగం గురించి వర్ణించాం. పాకనాడు సరిహద్దుల భూభాగానికి విస్తరించడంతో కాలక్రమంలో అందులో ఉప విభాగాలు ఏర్పడినాయి. వాటిలో పొదితనాడు అనేది ముఖ్యమైనది. ఈ విభాగం కావలి తాలూకాకు పరిమితమని శాసనాలు తెల్పుతున్నాయి. క్రీ.శ. 1217 నాటి కడనూతల శాసనం, క్రీ.శ. 1263 నాటి మంగమూరు శాసనాలలో పొదితనాడు ప్రస్తావన వుంది. 'పాకనాటిలోని పొదితనాడు' అని పేర్కొన్నాయి ఈ శాసనాలు.

నెల్లూరు జిల్లాలో మరొక పాలనా విభాగం పేరు - పూంగినాడు. ఇది పాకనాటిలో - అంతర్భాగమని కొన్ని శాసనాలు పేర్కొంటున్నాయి. కొన్ని శాసనాలు పాకనాటికి పర్యాయపదంగా పూంగినాడు అనే పేరు వాడాయి. కొన్ని శాసనాలను బట్టి పాకనాడు, పూంగినాడు వేర్వేరు ప్రాంతాలు అనే అభిప్రాయం కలుగుతున్నది. కొండవీటి రాజుల శాసనాలను ప్రకటించిన రామయ్య పంతులు - పూంగినాడు అనేది శ్రీశైల పూర్వ పార్శ్వముల నుంచి పూర్వ సముద్రం (బంగాళాఖాతం) వరకు వ్యాపించి వుండిందని అభిప్రాయపడ్డారు. అయితే ఇదే శాసన సంపుటి సంపాదకుడు కృష్ణశాస్త్రి దానితో ఏకీభవించలేదు. పాకనాటిలో పూంగినాడు అంతర్భాగమని ఆయన అభిప్రాయం. ఈ పూంగినాడులో నెల్లూరు జిల్లాకు చెందిన ఒంగోలు, దర్శి, కందుకూరు తాలూకా గ్రామాలు వుండినాయి.

అనవేమారెడ్డి శాసనం ఒక దానిని బట్టి పూంగినాడుకు అద్దంకి రాజధానిగా వుండిందని తెలుస్తోంది. విజయనగర పాలకులైన రెండవ దేవరాయలు గుండ్లకమ్మ వద్దన పూంగినాటి విభాగంలోని పోలవరం అనే గ్రామానికి వేజర్ల అనే పేరు మార్చి బ్రాహ్మణులకు అగ్రహారంగా ఇచ్చినట్లు ఒక తామ్ర శాసనం పేర్కొంటున్నది. కర్నూలు జిల్లా త్రిపురాంతకంలోని ఒక శాసనంలోనూ పూంగినాడు ప్రస్తావన వుంది. పూంగినాడు - చోళుల పాలనా కాలంలో జయంగొండ చోళ మండలంలో వున్నట్లు తమిళ శాసనాలు పేర్కొంటున్నాయి.

### ఉదయగిరి రాజ్యం

నెల్లూరు జిల్లా పరిపాలనా విభాగాలలో ఉదయగిరి రాజ్యం ఎంతో కీలకమైనది. క్రీ.శ. 1342నాటికి నెల్లూరు జిల్లా - విజయనగర సామ్రాజ్యంలో కలిసిపోయింది. విజయనగరరాజులు - నెల్లూరు, కడప

తరువాయి 6వ పేజీలో

15.2.2000 నిలుపు - మంగళవారం



16.2.2000 పెద్దకర్మ - బుధవారం

## బుర్లా శ్రీనివాసులరెడ్డి అంత్యక్రియలు

చిన్మయా మిషన్ మాజీ అధ్యక్షుడు, వేదజ్ఞాని, సలహాలకు సత్యానికి సంకేతుడు, ఆత్మవిశ్వాసుడు, అజాత శత్రుడు, సాధుగుణ స్వభావి, **శ్రీ బుర్లా శ్రీనివాసుల రెడ్డి** 5-2-00 తేదీన, మమ్ము దు:ఖసాగరంలో ముంచి స్వర్గస్తులైనారు.

వారి పవిత్రాత్మకు ప్రశాంతత కలగాలని ఆశిస్తూ...

**బుర్లా సరోజనమ్మ ... భార్య**

మరదళ్ళు
జెట్టి పుష్పావతమ్మ
పల్లికల మనోహరమ్మ

తోడల్లుళ్ళు
జెట్టి బలరామరెడ్డి
పల్లికల వెంకటరమణారెడ్డి, ప్లాంటు మేనేజరు, కృష్ణపట్నం పోర్టు

# ఆర్ఎస్ఎస్‌కు అంతటి అందలమా?

ఆర్ఎస్ఎస్ సాంస్కృతిక సంస్థ మాత్రమేనని, దానిలో ప్రభుత్వోద్యోగులు సభ్యత్వం స్వీకరించడం తప్పుకాదని సాక్షాత్తు ప్రధానమంత్రి ప్రకటన చేయడం అత్యంత విచారకర విషయం. ఆర్ఎస్ఎస్ ఆశయాలు, లక్ష్యాలు, కార్యక్రమాల గురించి సమగ్రంగా తెలిసిన వాజ్‌పాయి ఇంత పచ్చి అబద్ధం చెప్పడం గర్హనీయం. హిందుమతోన్మాదం తలకెక్కిన మత ఛాందసవాద సంస్థ ఆర్ఎస్ఎస్. వారిలో పరమత సహనం సైతం లేదు. దేశంలో జరిగే ప్రతి మతకల్లోలం వెనుక ఆర్ఎస్ఎస్ పరోక్ష హస్తం వుంటుంది. బిజెపి, భజరంగదళ్, విశ్వహిందూ పరిషత్ వంటివన్నీ ఆర్ఎస్ఎస్ ఉపవిభాగాల క్రిందే లెక్క. ఆర్ఎస్ఎస్ అధినేతనే వీటన్నింటినీ రిమోట్ కంట్రోల్‌తో నడిపిస్తుంటారన్నది జగమెరిగిన సత్యం. హిందూమత వ్యాప్తి, ఉద్ధరణ, ప్రాభవం వారి లక్ష్యం; హిందూ ధర్మ సంరక్షణ వారి కార్యక్రమం; హైందవ సంస్కృతి గొప్పతనం చాటడం వారి ఆశయం. ఈ ఆశయాలు, లక్ష్యాలు వుండడంలో తప్పు లేదు. ఏ మతం వారైనా తమ మతాలను అభివృద్ధి చేసుకోవడం, వ్యాప్తి చేయడం అభ్యంతరకరం కాదు. భారతీయులకు రాజ్యాంగమే ఆ స్వేచ్ఛ ప్రసాదించింది.

కాని ఇక్కడ ఆక్షేపణ అంతా - ఆర్ఎస్ఎస్‌కు కేవలం సాంస్కృతిక సంస్థ అనే మేలి ముసుగు కప్పి, ప్రభుత్వ యంత్రాంగంలో దాని ప్రవేశాన్ని చొప్పించ చూడడమే. మన రాజ్యాంగం మత ప్రచారానికి ఎట్లా స్వేచ్ఛ కల్పించిందో, ప్రభుత్వ వ్యవహారాలలో మత ప్రమేయం తగదని నిర్బంధమూ విధించింది. మతపరమైన, రాజకీయ పరమైన ఎటువంటి సంస్థలలో సభ్యత్వం స్వీకరించరాదని; వాటి కార్యకలాపాలలో పాలు పంచుకోరాదని - ప్రభుత్వ ఉద్యోగులకు స్పష్టమైన ఆదేశం జారీ చేసింది. దాన్ని అతిక్రమించడం రాజ్యాంగాన్ని ధిక్కరించడమే.

ఆర్ఎస్ఎస్ గత చరిత్ర తెలియనివారు లేరు. జాతి పిత మహాత్మాగాంధీ హత్యతో ఆ సంస్థ ప్రమేయం చారిత్రక సత్యం. పలుమార్లు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు దాన్ని నిషేధానికి గురిచేశాయి. ప్రతి నిషేధం వెనుక కారణం - మతమౌఢ్యమే! బాబ్రీ మసీదు విధ్వంసం నుంచి, ఇప్పటి 'వాటర్' సినిమా షూటింగ్‌పై దాడుల వరకు ఆర్ఎస్ఎస్ పాత్రను ఎవరూ కాదనలేరు. మహమ్మదీయ, క్రైస్తవ మతాలపై వారి పత్రికలలో వచ్చే వ్యాసాలు రెచ్చగొట్టేవిగా వుంటాయి. పూర్తిగా మతం ప్రేరణతో నడిచే ఈ సంస్థకు సాంస్కృతిక సంస్థ అని వాజ్‌పేయి సర్టిఫికెటు ఇవ్వడం; ప్రభుత్వోద్యోగులు దానిలో సభ్యత్వం తీసుకోవడం తప్పు కాదని గుజరాత్ ప్రభుత్వాన్ని సమర్థించడం గర్హనీయమైన నేరం.

బిజెపికి ఒక పార్టీగా స్వతంత్ర వ్యక్తిత్వం లేదని, ఆర్ఎస్ఎస్ గీచిన గిరిలో నడవడమే దానికి తెలిసిన విద్య అని లోకానికంతటికీ తెలుసు. కాని వ్యక్తిగతంగా వాజ్‌పాయి పట్ల మాత్రం ప్రజలలో, ఇతర రాజకీయ పార్టీలలో ఒక విశ్వాసం వుండేది. ఆయన విశాల భావాలు కలిగినవాడని, మత పరమైన సంకుచితతత్వాన్ని దరి చేరనివ్వడని, స్వతంత్ర పోకడలతో వ్యవహరిస్తాడని జనం నమ్ముతున్నారు. కానీ ఆయనే ఇప్పుడు ఆర్ఎస్ఎస్‌ను అంతటి అందల మెక్కించారు. దాని నిజ స్వరూపం దాచిపెట్టి, అబద్ధపు చిత్రణ చేస్తున్నారు. వ్యక్తిగతంగా ఈ భావం వ్యక్తం చేసి వుంటే ఒక రకం; ప్రధాన మంత్రిగా ఆ ప్రకటన చేయడంతో దానికి అధికారిక ముద్ర పడింది. దాన్ని అలుసుగా తీసుకొని ఇతర బిజెపి పాలిత రాష్ట్రాలు సైతం గుజరాత్ ప్రభుత్వ ఉత్తర్వును తాము విడుదల చేసేందుకు ప్రయత్నిస్తున్నాయి.

దేశ ప్రధానిగా వున్న వ్యక్తి ఒక మత విశ్వాసానికి, ఒక మత సంస్థకు మద్దతు పలకడం అవాంఛనీయం. భిన్నమతాలు, జాతులు కలిగిన దేశంలో ప్రభుత్వాధినేత అందరి విశ్వాసం చూరగొనగలిగినప్పుడే పరిపాలన సుకరంగా నడుస్తుంది. ప్రభుత్వాధినేత పట్ల ఒక వర్గం ప్రజలలో అపనమ్మకం, అనుమానం ఏర్పడితే ఇక ఆ ప్రభుత్వం చేపట్టే ప్రతి చర్య వివాదాస్పదం అవుతుంది. ప్రజలలో అశాంతి చెలరేగుతుంది. ఇది తెలిసి వాజ్‌పాయి అంత అవివేకంగా ఆర్ఎస్ఎస్‌ను తన భుజాలపై మోయడానికి పూనుకోవడం ఎందుకో అర్థం కాదు. ఆర్ఎస్ఎస్, బిజెపి నేతలు ఆయన మెడలు వంచి ఈ మాటలు మాట్లాడిస్తున్నట్లున్నారు.

అసలు ఆర్ఎస్ఎస్ కార్యకలాపాలలో ప్రభుత్వోద్యోగులు పాల్గొనడం అంత ముఖ్యమైన కార్యమా? "వాటర్" సినిమా షూటింగ్ అంత జాతీయ ప్రాధాన్యత కలిగిన అంశమా? వాటి కోసం కేంద్ర ప్రభుత్వం యావత్తు తన దృష్టిని కేంద్రీకరించవలసిన అగత్యం ఏర్పడి వుందా? ప్రభుత్వం చేపట్టవలసిన కార్యక్రమాలు మరేవీ లేవా? దేశ భవిష్యత్తుకు, దేశ ప్రజల శ్రేయస్సుకు ఎంతో కీలకమైన పలు అంశాలు సరైన ప్రాధాన్యత లభించక మూలపడి పోతున్నాయి. విద్య, వైద్యం, దారిద్ర్యం వంటి అంశాల పట్ల దృష్టి సారించి, అహోరాత్రులు శ్రమించి పనిచేయవలసిన పాలకులు ఇటువంటి అనవసర రగడలు తామే సృష్టించి, వాటిలో తలమునకలుగా కాలం గడపడం క్షంతవ్యం కాదు. మతం కంటె ఆకలి ఎంతో శక్తివంతమైనది. ఆకలిగొన్నవాడికి తనకు కడుపునిండా తిండి పెట్టే వాడే ముఖ్యంకాని, ఆ పెట్టే చెయ్యి హిందువుదా, ముస్లిందా, క్రైస్తవుడిదా అన్న విచక్షణ వుండదు. ప్రభుత్వం చేయవలసిన పని ప్రజల ఆకలి, అవసరాలు తీర్చడం; మత ప్రచారం చేయడం కాదు. వాజ్‌పాయి దృష్టిలో ఆర్ఎస్ఎస్ సాంస్కృతిక సంస్థ అయితే, మరొకరి దృష్టిలో జమాతే ఇస్లామీ, హురియత్ కాన్ఫరెన్స్, శిరోమణి అకాళీదళ్, సాల్వేషన్ ఆర్మీ వంటి సంస్థలూ సాంస్కృతిక సంస్థలే అవుతాయి. సంస్థల స్వరూపం వాటిని పరిశీలించే దృక్పథాన్ని బట్టి ఆధారపడి వుంటుంది. లష్కర్-ఎ-తోయిబా మన దృష్టిలో మిలిటెంట్ టెర్రరిస్ట్ సంస్థ; కాని పాకిస్తానీయులకు అది స్వాతంత్ర్య పోరాట సంస్థ. ఆర్ఎస్ఎస్‌ను అటువంటి ఉన్మాద, కిరాతక సంస్థతో పోల్చడం మా ఉద్దేశం కాదు. కాని అటువంటి ఉదాహరణలకు ఆస్కారం కల్పిస్తున్నారు ఇప్పుడు ప్రధాని వాజ్‌పాయి. ఇప్పటికైనా తన అవివేకం తెలుసుకొని, ఆర్ఎస్ఎస్‌ను అందలం నుంచి దింపాలి; ఈ చెత్త వివాదాలతో పొద్దు పుచ్చకుండా దేశహితం కోరే పనులకు తన మేధో సంపత్తిని వినియోగించాలి. *

జమీన్‌రైతు

---

జమీన్‌రైతు

10.2.50

వెల: 0-2-0 పేజీలు: 14

## నెల్లూరు ముచ్చట్లు

### కాంగ్రెస్ స్థలం

నెల్లూరులో కొత్తహాలుకు తూర్పున కలెక్టరాఫీసుకు దక్షిణపు ప్రక్కనున్నటి సుమారు 60సెంట్ల ఖాళీ స్థలాన్ని కాంగ్రెసు భవన నిర్మాణార్థం ప్రభుత్వం వుచితంగా యిచ్చింది. కాన్వకు [illegible] లో వేలుమొదలియార్ ప్రక్కన వుండే ఖాళీ స్థలాన్ని ఇమ్మంటున్నారు. [illegible] ఎవి సుబ్బారెడ్డి గారితో సంప్రతించవలెను.

### శకుంతల

"వాణికేమ 'శకుంతలం'"-

ప్రదర్శించువారి గాడు ప్రేక్షకులు కూడా సాహిత్య పరిచయం కలిగినప్పుడే రాణింపు.

కాళిదాస శకుంతల నాటకప్రక్క [illegible] రంగస్వామి గార్లనేక ప్రక్క [illegible] దొరస్వామి ప్రక్కనే మెగ్గింది [illegible] ఇక మళ్ళీ ఆంధ్రదేశంలో చూడలేమా?

ఆంధ్రసభ వారి కృషికి, కోమిరాజు గర్త, సూర్యకుమారి గార్ల సాహసమునకు మా వందనములు.

### స్వాతంత్ర్యోద్యానవనం

ఫెర్మను గారిని కలుసుకున్నాం. ఆయన చెప్పేది యిప్పుడు నిర్ణయించిన స్థలమైతే 10, 15వేల ఖర్చుతోగాని లెవలుగాదని, ప్రక్క కాల్వ వెల్లువవచ్చు ప్రమాదంగా వుంటుందని. కో ఆపరేటివ్ బ్యాంకికి తూర్పున అయితే ఆ ఖర్చు వుండదు అంటాడు. పట్టికు వందలైనా కొంత వసూలు చేసి కొంత మునిసిపాలిటి అయినా భరించి ఇప్పుడు నిర్ణయించిన స్థలాన్ని నిర్ధారణ చేయడం బాగుంటుంది.

50 ఏళ్ళక్రితం ఈ వారం

కాని బ్యాంకి తూర్పు స్థలం మాత్రం ఏమంత రాణించదు. దీన్ని గూర్చి ఎవరైనా నలుగురు పెద్దలు ఫెర్మను గారితో సంప్రతించి కార్యనిర్వహణకు పూనుకుంటే బాగుంటుంది. అనవసర విమర్శలకంటె కార్యం గదా మనకు ప్రధానం.

### కోడూరు బస్

మురగన్ ట్రాన్స్‌పోర్టు బస్, నెల్లూరు నుండి పొట్లపూడి ద్వారా కోడూరుకు పోవలసినట్లు మార్గం నిర్ణయమై వుండగా, పొట్లపూడికి పోకుండానే కోడూరుకు పోతున్నది. అది నిరభ్యంతరంగా నిర్ణయం లేకుండా, ఎప్పుడంటే అప్పుడు.

తరువాయి 8వ పేజీలో

---

జనవాణి

# 'వాటర్'పై ఎందుకీ అనవసర రభస!

భారతదేశంలో రామరాను భావప్రకటన స్వేచ్ఛపై దాడి జరుగుతున్నది. చారిత్రక సత్యాలన్నీ రాజ్యమేలే ప్రభుత్వానికి అనుకూలంగా వుండాలంటే ఎలా? దీపామెహతా తీస్తున్న వాటర్ చిత్రం కాశీలోని వితంతువుల దుర్భర జీవితానికి సంబంధించినదని అంటున్నారు. అటువంటప్పుడు ఈ చిత్రంపై అనవసర రభస ఎందుకో? జామె సంస్కృతి పరిరక్షకుల మైనట్లు కుహనా సంస్కృతి పరిరక్షకులు ఈ చిత్రం సెట్‌పై దాడి చేయడం, నటీమణులను సైతం కాశీ నుంచి పంపివేయడం దారుణం. ఎన్నికల్లో బిజెపి ప్రభుత్వం స్వదేశీ నినాదాన్ని జాతి నరనరాన ఎక్కించి, అధికారం అందుకోగానే బహుళజాతి సంస్థల కొమ్ము కాస్తున్నది. ఎన్రాన్ ప్రాజెక్ట్‌పై ఆకాశం ఊడిపడినట్లు విచారం చేసి ఆ తర్వాత ఎన్రాన్‌తో ఎలిమి చేసిన వారెవరో దేశ ప్రజలందరికీ తెలుసు. సంస్కృతి, దేశగౌరవ పరిరక్షణ అనేవి ఏ ఒక్కరి పేటెంట్ హక్కులు కావు.

నెల్లూరు — పి.సుధారాణి

## గృహనిర్మాణ బిల్లు లిప్పించండి!

అల్లూరు మండలం, ఇస్కపల్లి పంచాయతీ పరిధిలో సముద్రానికి దగ్గరవుండే ఇస్లామాబాద్ కాలనీలో 1998 సంవత్సరంలో శాశ్వత గృహనిర్మాణ పథకం క్రింద ఇళ్లు మంజూరయ్యాయి. త్వరత్వరగా ఇళ్లు కట్టుకొంటే గృహవసతితోపాటు, బిల్లులు మంజూరవు తాయన్న ఆశతో భార్యల ముక్కుపుడకలు సైతం తాకట్టు పెట్టి పనులు పూర్తి చేశాం. కాని నేటి వరకు బిల్లులు మంజూరు కాలేదు. అధికారుల చుట్టూ తిరిగి తిరిగి వేసారిపోయాం. రాష్ట్ర గృహ నిర్మాణ

తరువాయి 8వ పేజీలో

రెండు వినూత్న శక్తుల కలయిక - విద్యా రంగానికి కానుక




# రత్నం కోచింగ్ సెంటర్

హరనాథపురం, నెల్లూరు, Ph: 0861-336767, 321818, 325473, 321347, 321356, 321349

- నేటి విద్యా సంవత్సరము నుండి KORA విద్యా సంస్థలను మాయందు విలీనం చేసికొని, అధ్యాపక వృత్తిలో నిష్ణాతులైన "శ్రీ KORA" గారి పూర్తిస్థాయి సేవలతో 2000 - EAMCET నుండే ఉత్తమ శిక్షణనివ్వడానికి సిద్ధంగా ఉన్నామని తెలియజేయుటకు హర్షిస్తున్నాము.
- విద్యార్థుల బుద్ధి వికాసానికి, లక్ష్యసిద్ధికి వీలుగా సరియైన ప్రణాళికను తయారుచేసి దానిని డైరెక్టర్ కె.వి. రత్నం గారి స్వీయ పర్యవేక్షణలో అమలుపరచి, ఆశించిన ఫలితాలను సాధించుచున్న సంస్థ **'రత్నం'**
- EAMCET కు ఆయువుపట్టు అయిన "Physics" పరిజ్ఞానమును విద్యార్థులకు కరతలామలకముగా బోధించుటలో నిష్ణాతులైన Sri KORA గారు మా "Excellent Teaching Staff" తో కలసి సమష్టిగా కృషి చేయుదురని తెలియజేయుటకు సంతసించుచున్నాము.
- 2000 - EAMCET Short Term Coaching మెడికల్ / ఇంజనీరింగ్ - తెలుగు/ఇంగ్లీషు మీడియాలో ఇంటర్మీడియట్ పరీక్షలు ముగిసిన వెంటనే ప్రారంభము.
- విద్యార్థినీ విద్యార్థులకు వేరువేరుగా హాస్టల్ వసతి కలదు.
- గమనిక : రూ.1000లు D.D. / M.O. పంపి సీటు రిజర్వు చేసికొనవలయును.
- హైస్కూలులో చేరదలచినవారు వెంటనే సంప్రదించవలెను.
- ఈ విద్యా సంవత్సరము జూనియర్ ఇంటరు నుండి గణితశాస్త్ర నిష్ణాతులు, సుప్రసిద్ధ ప్రొఫెసర్ శ్రీ ఎ.వి. ధర్మపాదం గారి పర్యవేక్షణలో ఐ.ఐ.టి. శిక్షణ ప్రారంభించినామని తెలియజేయుటకు హర్షిస్తున్నాము.

## EAMCET - 2001 SPECIAL INTENSIVE COACHING 2000సం. JUNE నెలలో ప్రారంభమగును.

**RATNAM COACHING CENTRE**
Haranathapuram, Ph: 336767, 325473
**RATNAM JUNIOR COLLEGE** (Day Scholars)
Haranathapuram, Ph: 321323
**RATNAM RESIDENTIAL HIGH SCHOOL**
**RATNAM RESIDENTIAL COLLEGE FOR BOYS**
**RATNAM RESIDENTIAL MAHILA KALASALA**
Pidathapoluru, Ph: 37553, 37563, 37576




**KORA COACHING CENTRE**
Saraswathi Nagar, Nellore, Ph: 321347
**KORA RESIDENTIAL COLLEGE**
Chemudugunta, Ph: 321349, 321350
**KORA RESIDENTIAL MAHILA KALASALA**
R.I. Reddy Nagar, Ph: 321358
**KORA JUNIOR COLLEGE** (Day Scholars)
Saraswathi Nagar, Ph: 321347

"విద్యార్థుల బంగారు భవిష్యత్తు" - "రత్నం విద్యాసంస్థల ఏకైక లక్ష్యం"

**K.V. Ratnam - Director**

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Ph: 091-861-327354. Offset Printing at Zamin Ryot Press, Nellore